# బ్రతుకు తెరువు

షట్టి కృష్ణమూర్తి

విశ్వభారతీ పబ్లికేషన్సు
బకింగ్‌హామ్‌పేట — విజయవాడ-2

# బ్రతుకు తెరువు

నాకు తల్లిదండ్రులు చేసిన నామకరణం అంటూ ఏదీ లేదు. పుట్టిననాటినించీ 'చిట్టీ' అని పిలవడమే అందరికీ అలవాటయిపోయింది. రాను రాను ఇప్పుడు పెద్దదాన్నయినప్పటినించీ 'చిట్టెమ్మ' అయినాను.

అసలు కారణమేమిటంటే నాకంటే ముందు ముగ్గురు పిల్లలు పుట్టిపోయారట; ముగ్గురూ ఆడపిల్లలేనట. అదేం చిత్రమో మరి, నాలుగో కాన్పు నేను. నేను బ్రతికి బట్టకడతానని అప్పట్లో యెవ్వరూ అనుకున్నవారు లేరట. ఏదోవిధాన బ్రతికితేచాలునని పేరుకూడా పెట్టినవారుకారు. ముందుగా ఏ అమ్మ పిల్చిందోకాని నన్ను 'చిట్టీ' అని, బ్రతికున్నంతవరకూ అదే ఖాయమైంది. నాతర్వాతనే రెండేండ్లకొక మగపిల్లవాడు కలిగాడటగానీ, వాడూ దక్కలేదు.

అందరిలాగే పెరిగి పెద్దదాన్నయాను. పెళ్ళీ, పేరంటం అన్నీ యథావిధిగానే జరిపించాడు మా నాన్న.

కాపరానికి వెళ్ళిన రెండేండ్లకే మా అమ్మ చనిపోయింది. తర్వాత మరో ఏడాదికి మానాన్నకూడా యీలోకాన్నించి దాటుకున్నాడు.

పినతల్లులుగానీ, మేనత్త మేనమామలుగానీ, ఇంక నాకు వెనకా ముందూ యెవ్వరూ లేకపోవడంవల్ల యెల్లకాలమూ మా అత్తగారింట్లోనే వుండిపోయాను.

మా నాన్నైనా బొత్తిగా కూటికీ, గుడ్డకీలేని సంబంధం చెయ్యలేదు. మా అత్తవారికి నా పెళ్ళయేనాటికి పెద్ద ఆస్తి పాస్తులు లేకపోయినా, అంతకుపూర్వం రోజులలో వారు ఘనంగా బ్రతికినవారేనట! అయితే మాత్రమేం? రాబడి తక్కువ, వున్నది కాస్తా అమ్ముకుతినడం, ఎన్నాళ్లలా గడుస్తుంది? అంతటితో ఆస్తులు అంతరించినై. ఈ సుపుత్రుడు ఒక్కడూ పెత్తనం వెలిగించవచ్చేనాటికి, వొక పెద్ద మండువా లోగిలీ, ఏడాదికి నలభై బస్తాలు ఆదాయంవచ్చే భూవసతీ మిగిల్చిపోయారు మామగారు.

ఈయనమాత్రం ఆ తండ్రికి కొడుకు కాదూ? క్రమక్రమంగా యీ వసతి కాస్తా కర్పూరంలా హరింపజేసుకుని అరవై రూపాయలకొక షావుకారుదగ్గర గుమాస్తాగా జేరారు. బ్రతికున్నంతవరకూ మా సంసారానికి ఆ వొచ్చే నాలుగురాళ్లే గతి అయినవి.

కాపరానికి వచ్చిన పదేళ్ళవరకూ నాకు పిల్లా జెల్లా లేదు. ఆయనా, నేనూ ఇద్దరం లింగూ లిటుకూ అంటూ లంకంతకొంప! నా కొక్కర్తెకి ఆయింట్లో యేమీ తోచేదికాదు. ఆయన వేళ్ళపట్టునవచ్చి నాలుగు మెతుకులు ముక్కా-నోటా కొట్టుకుని యేదో ముంచుకుపోయినట్టు అప్పటికప్పుడే పరుగెత్తి పోతూవుండేవారు. ఇంక రాత్రి ఏ ఝాముకో రాక!

ఒకొక్కనాడు ఆయన వొచ్చేసరికి నేను అన్నం తిని నిదురోతూవుండేదానిని—

# బ్రతుకు తెరువు

వస్తుతః ఆ మనిషికూడా సంసారం వ్యావర్తి అంతగా వున్నవారు కాకపోవడంవల్ల ప్రతిదానికీ నా పని మరీ ఇరకాటాన పడింది. ఏ వస్తువు కావాలన్నా అది ఆయనచేత తెప్పించేసరికి బ్రహ్మప్రళయం అయ్యేది. ఎన్నాళ్లు నెత్తిన నోరుపెట్టి మొత్తుకున్నా చెవినిబెట్టేవారే కాదు. విన్నప్పటికీ నా మాటమీదకాని, సంసారంలో వున్న అవసరంమీదకాని లక్ష్యం అంతకంటే వుండేదికాదు. పోనీ, కావల్సినవి నేనే కొనుక్కుంటాను నా మొహాన పదిరూపాయలు పారెయ్యమంటే ఆపనీచేసేవారుకాదు. ఆయనచేత్తో తెచ్చిందల్లా బంగారంగా యెంచుకోవాలి! నిజానికి నేను చేసిందికూడా అంతే.

అంతకంటే నాకు గతేమున్నది? చీటికీమాటికీ అలిగిపోతే నన్నాదరించేందుకుపుట్టినింటిదగ్గిర 'నా' అన్న వారెవ్వరూ లేరాయె!

తనమాట కెదురాడితే, తను తెచ్చినవి మెచ్చుకోకపోతే యీ రేడుతరాల్నించి యెత్తిపొయ్యడం ఆయనపని. వారి పూర్వులు-తాతలు తండ్రులు - ఎలా బ్రతికితేనేం? వారెంతటి పామేదారైతేనేం, అదంతా యిప్పుడు వెళ్ళబోసుకున్నందువల్ల కలిసివచ్చే దేముందీ? మన బ్రతుకంతా కలిసి యీ భైరూపాయల ఖరీదేనా మరేమన్నావుందా? అంతమాత్రానికే అతిశయ పడడమెందుకు?

ఈ మాటలే నేనంటే ఆయన పళ్ళుకొరికి గుడ్లురిమి చూసేవారు. అకారణంగా ఆయనకెందుకో అంత కావేషం? ఇంట్లోవున్న నాలుగుఘడియలూ, యీ తీరున యేడిపించుకుని

తినేవారు, తనకి యిష్టమైనరోజున యెక్కడలేని వగలూ-వాలక బోసేవారు.

ఈ తీరుగా ఎన్నాళ్ళుగడిచినా, నా జీవితానికి ఒక దరీ, అంతూ లేకపోయింది. పోనీ, వొక్కనలుకైనా కనిపించితే బావుండును, దాంతోనే పొద్దుపుచ్చుకోనచ్చు ననుకున్నాను. కాని నావంటి దురదృష్టవంతురాలికి అదీ కరువేఅయ్యింది.

ఒక ముద్దూ - ముచ్చటా లేదు. నోములూ, వ్రతాలూ అంతకంటే యెరగను. ఒక్కమాటలో చెప్పాలంటే చావలేక బ్రతకడమే - పునిస్త్రీగా బ్రతికినందుకు ఆ జన్మానికి తగిన ఇంపూసొంపూ యేమీ అనుభవించలేదు.

ఒకనాడు కాదు, రెన్నాళ్ళుకాదు. కొన్నిసంవత్సరాలు ఆ విధాన గడిచిపోయింది నా బ్రతుకు–మొదటినించీ నేను దేని కోసం కలలుకంటున్నానో, ఆరాటపడిపోతున్నానో, అది యీ నాటికి ఫలించింది. నాకు ఆడపిల్ల కలిగింది.

భూమిమీద పడగానే దానిమొహం చూసుకుని 'అమ్మయ్యా' అనుకున్నాను. అంతవరకూ–పదేళ్ళనుంచీ–కొయ్యబారి మోడైపోయిన నాజీవితం చిగుర్చుతుందికదా అనుకొన్నాను.

దానిమూలాన నాకూ చేతినిండుగా పనిదొరికింది. పొద్దు అలాగ్గా ఇట్టే గడిచిపోయినట్టుంటూంది.

ఈ మనిషి సంసారబాధ్యత తెలియనివారూ, అయిన

కాడికి జమాబందీగా స్వాధీనపరచుకుపోయేవారని ఇదివరకే చెప్పానుకాదూ? దాని ఫలితం మాత్రం ఈ నాటికి కనబడింది.

అసలు మగవాళ్ళు పుట్టుకతోనే స్వతంత్రులు కదా! వారి స్వంతవ్యవహారాలవిషయంలో ఇదేమిటని అడగడానికి నాబోటి అనాధకు హక్కు, అధికారము ఏముంటుంది ? – ఈ అనాధ అనేపేరు మావారు నాకెప్పుడో పెట్టుకున్నారు. కనక వారేంచేసుకుంటున్నారో ఒక్కనాడుకూడా నోరువిప్పి నాకు చెప్పిన పాపానపోలేదు. నేను అడిగి చీవాట్లు తినలేను.

ఈ నాటికి తేలిన ఫలితంమాత్రం యిది – మావారి స్వంతఖర్చులకీ సంసారం ఖర్చులకీ కూడా ఆయన సంపాదన ఏమాత్రమూ సరిపోలేదు. అందువలన చేబదుళ్ళుగా కానీ, మరోవిధంగా కాయితం కరామత్తులు వ్రాసిగానీ తమఉద్యోగం చేస్తున్న షావుకారిదగ్గిరే డబ్బు తీసుకుంటూవచ్చారు.

ఒకొక్కప్పుడు చిన్నచిన్న పద్దులకు వారే జీతంలో మినహాయించుకుని మిగతాది యీాయనగారిచేతులో పెడుతూ వుండేవాళ్ళు – కొన్నాళ్ళకు ఈయనలో వుండే బలహీనతను గ్రహించారు. అడిగితే లేదనకుండా అప్పుయివ్వడం, కాయితం వ్రాయించుకోనడం మొదలుపెట్టారు.

ఈ విధాన తీసుకున్నదంతా పాపం పెరిగినట్టు పెరిగి పోయింది. వందలుదాటి వేలైంది ఒకనాడు దీన్నంతనీ చెల్లించే విషయంలో నిలదీసి అడగడంకూడా జరిగింది. దానికి సమాధానంరానిపక్షంలో ఉన్న ఉద్యోగం కాస్తా వూడిపోయే ప్రమాదంకూడా సంభవించింది.

అప్పటికి వెనక్కి తిరిగి చూసుకుంటే మిగిలిందల్లా తాతలనాడు కట్టించిన యీ యిల్లు వొక్కటే. దాన్నికూడా తనచేతులమీదుగా కడతేర్చివేస్తే బాగుంటుందని తోచిందేమో వెంటనే అంతపనీ చేసేశారు.

ఈ లంకంత కొంపా దొడ్డీ, తోటా అన్నీ కలిసి ఆరు వేలకు షావుకారుకు వ్రాసి యిచ్చేశారు. దీనికి బదులుగా అతగాడు మాకుచేసిన సాయమల్లా వొక్కటి—తనదగ్గిర యీయన ఉద్యోగం చేస్తున్నంతకాలం ఒకపాక వేసుకుని ఉండటానికి రెండువందలగజాల స్థలంమాత్రం అద్దెలేకుండా యిచ్చారు.

ఇల్లు వారికెప్పుడు వ్రాశారో వెంటనేవచ్చి స్వాధీనం చేసుకున్నారు. మిగిలివున్న సామానుతో క్రొత్తగా వేసిన పాకలోకి మేం నడిచాం.

'నాది' అని చెప్పుకోతగిన యిల్లుకూడా వొకళ్ళపరమయ్యాక ఆయనలో కొంత మార్పొచ్చింది. చేతిలో తడారిపోతే మనిషి అసలు తత్వం బయటపడక ఏముంది మరి?

ఇన్నాళ్ళనించీ తనకున్న స్నేహితులంతా ఛీ దూరంగా పొమ్మని, అంటరానివాణ్ణి తరిమినట్టు తరుముతున్నారు. తనవల్ల సహాయంపొంది తనచేతిడబ్బు ఖర్చుచేయించిన యెవ్వరూ ఆదుకోరావడంలేదు.

తనకువచ్చే కొద్దిపాటి జీతంతో సంసారం గడవటంలేదు. ఇంక యెక్కడా కానీ అప్పుపుట్టదు. చూస్తూచూస్తూ ఈయన

గుట్టూ మట్టూ తెలిసిన యెవ్వారుమాత్రం బయటపడతారు కనక ?

ఇవన్నీ కలిసి ఆయన్ను బాగా క్రుంగదీసినై, మనిషి సగమైపోయాడు. కొత్తయింట్లోకి వెళ్ళిన నాలుగైదు నెలలకే క్షయవ్యాధి ప్రారంభమయింది. ఒక్క నెలరోజులకే మమ్మల్ని నట్టేట్లో ముంచీ ఆయనా వెళ్ళిపోయాడు !

అప్పటి కిది ఏణ్ణర్థంపిల్ల. ఇకముందు నా బ్రతుకెలా వెళ్ళ మారుతుందో ఏం పెట్టుకు బ్రతకను ? ఎవర్ని ఆసరా జూచుకు అడుక్కు తినడం కూడా చేతకాని అనాధబ్రతుకు నాది.

అయినా నా సంగతి పట్టించుకునే అవసరం ఎవ్వారికేడి సింది? నిజానికి ఆయొక్క పాపం, అనుకునేలోకం దృష్టిలోనాకు ప్రాప్తించినకష్టం సామాన్యమైనది కాదు. ఓ విధాన తట్టుకుని సోదాప్పచెందే అవకాశంకలది అంతకంటే కాదు.

అయితే, అందరూ నన్ను జూచి జాలితల్చాలి, తగిన సాయంచేయాలి. ఇప్పుడు నాకుకావలసింది మాటసాయం మాత్రమేకాదు, డబ్బుసాయం.ఎవరికి వారు మొహాలవంక జూసుకునేవారే కాని తెగించి ముందుకువచ్చేవారు లేరు. మా ఆయన పూర్వచరిత్రఅంతా తెలిసినవాళ్ళు మొదట నన్ను చూసి జాలిపడినా ఆయనమీద మెటికలు విరవడం మాన లేదు. పైగా గోరుచుట్టుమీద రోకలిపోటులా నా బతుక్కు ఈపిల్లకూడా వొకర్తె దాపురించిందాయిమరి! ఒకవంక దానిని సాకుకుంటూ నా బ్రతుకు నేను బ్రతకాల్సినగతి పట్టింది.

కొత్తలో—నేను మరీ వీధిమొహం చూడడానికి భయ

పడి చచ్చేరోజుల్లో అడపాదడపా నాకు సాయంచేసినవారంతా దానిమొహంచూసే చేశారని చెప్పాలి. కట్టెలా నేనెలా బ్రతికితేమాత్రం నావంక జూసేదెవరు?

ఏమైనా నేను జీవితం వెళ్లదీయడం బహుకష్టమే అయింది. కొన్నాళ్ళవరకూ, నేనైనా పుష్కలంగా నగా-నట్రా వున్నదాన్నయితే ఒక్కళ్ళని లెక్కజేయకుండా అవ్వన్నీ తెగనమ్ముకునైనా బ్రతకగలిగేదానిని. కనీసం వుండడానికి ఇల్లయినా లేని పక్షినైపోతిని.

కొన్నాళ్ళవరకూ చెంబులూ, గ్లాసులూ, పీటలూ, చాటలూ అన్నీ అమ్మించి గడుపుకున్నాను. ఇక బ్రతకదల్చుకుంటే యేదోవొక పనిచేసుకోవాల్సిన అగత్యంమాత్రం వున్నదని తెలుసుకున్నాను. ఒకనాటిరాత్రి నాఅంతట నేనే పడుకొని ఆలోచించాను. ఏమీ తోచలేదు. పక్కింటి డాక్టరుగారి భార్య ఆయనగారికి అన్నంపెడుతూ మాటల ధోరణిలో ఇలా చెప్పుకుపోవడం విన్నాను: "ఈరోజుల్లో పనిమనిషి కుదరడమే మరీ యాతనైపోతోంది. మెడమీదతలున్న ప్రతిదీ పదులూ, పదిహేనులూ తేమ్మంటుంది. పైగా చీరెలూ, రెవికలూ మామూళ్లట. ఇదివరకటిరోజుల్లో నోరుమూసుకుని కుక్కల్లా చేసుకుపోయేవాళ్ళు" అని.

వెంటనే నాకొక ఆలోచనతట్టింది. లక్ష్మియమ్మగారిని బ్రతిమాలుకొని వారియింట్లో పనిమనిషిగా చేరితే ఆ పదీ నాకేవస్తుయ్ కదా అని. అలా ఎందుకుతోచిందో నాకే అర్థంకాలేదు——

ఏమైనాసరే అనుకున్నాను, మర్నాడుపొద్దునవెళ్ళి ఆవిడ గార్ని అడిగేశాను – 'అ...వ్వ – నీ కిదేంఖర్మమే' అని నోరు నొక్కుకున్న దావిడ – నిజానికి ఇదంతా నాకర్మం కాకపోతే మరేవిటి? దానివల్లనే ఇలావచ్చి అడిగాను. మా పాపాయ్ మొహంచూసైనా నాకీపని ఇప్పించండి అని కాళ్లావేళ్లాపడి బ్రతిమాలుకున్నాను. మరొకచోటుకు వెళ్ళి అడగడానికి అభిమానంతో చచ్చిపోతున్నానని ఆవిడ యెదుటనే వలవలా యేడ్చాను.

ఓ క్రమాలకి ఆవిడే అన్నది-సరే-అయితే బాబుగారిని కనుక్కొని రేపుచెపుతాలే అని.—

అయినా అందుకు వొప్పుకున్నట్టున్నారు లేదా వారిలో వారేం మధనపడ్డారో. మర్నాటినించే నేను పనిలోచేరాను—

నేనక్కడ చెయ్యవలసిందల్లా, అంట్లూ చెంబులూ తోమడం, ఇల్లు వూడవడం పిల్లలకు తలదువ్వి జడలువెయ్యడం – వెళ్ళినకొత్తలో అంతవరకుమాత్రమే చెయ్యమన్నారు. వంటకు వేరేమనిషి వున్నది. నే నీపని చేస్తున్నానని తెలిసి కొందరు ముక్కుపై వేలు వేసుకున్నవారు లేకపోలేదు. ఆ సంగతి నాకు మొదటనే తెలుసుగా.

ఏదియేమైనా నా బిడ్డను బ్రతికించుకుంటే చాలుకదా అనుకొన్నాను. పనికి వెళ్ళబోయేముందు పాలిచ్చి అరుగు మీద కూర్చోబెడితే వారిపిల్లలే ఆడించేవారు. అప్పుడప్పుడూ మరీ పోరుపెట్టి యేడుస్తుంటే డాక్టరుగారే యెత్తుకు సముదా

యించేవారు కూడా. ఆయన అలా యెత్తుకోవడం చూసి నేను సిగ్గుతో సగం చచ్చిపోయేదాన్ని.

ఎన్నోసార్లు నేనలా కష్టపెట్టుకోవడం చూసి ఆయనే అన్నారు. 'అమ్మా! యేనాటికి ఎవరిస్థితి యేమౌతుందో మన మేం చెప్పగలం? ఇంతమాత్రానికే మాభాగ్యమంతా నీకూతురుకు ఇచ్చేశామా?' అంటూ దానిని మరోమారు ముద్దుపెట్టుకొని నాకు ఇచ్చేవారు.

ఆయన అలా అంటుంటే ఏనాడో చనిపోయిన మా నాన్న జ్ఞాపకం వచ్చేవాడు. ఇంటికివెళ్ళి దానిని అక్కునజేర్చుకొని వలవలా ఏడ్చేదానిని.

వస్తుతః డాక్టరుగారు చాలామంచివారు జీవితంలో కష్టసుఖాలు బాగా చవిచూసినమనిషి. పొద్దస్తమానం రోగులకు సేవచెయ్యడంలోనే ఆయన జీవితంలో మూడువంతులు గడిచిపోయింది. అందరినీ అర్థంచేసుకొని అనునయంగా గుండెకరిగేలా మాట్లాడగలరు. కడుపెడు సంతానం, వాళ్ళయిల్లు ఎప్పుడుచూసినా కలకల్లాడుతూనే వుంటుంది.

పిల్లల్ని యెలా సాకుకురావాలో యెవర్ని యెంతటి శిక్షణలో అట్టేపెట్టాలో లక్ష్మొయమ్మగారికి బాగా తెలుసు.

ఎన్నివున్నా వారిజీవితంలో వారికొక్కటే విచారం — కాపురంచేసుకొంటున్నపిల్ల కడుపులో చిచ్చుపెట్టి చనిపోవడం. ఆ యమ్మాయిపేరు పుష్పవల్లి ఆ నాటినించే వారిద్దరూ సగమైపోయారట. ఇప్పుడుకూడా ఏదో ఒకమాటవరసని పుష్పవల్లిని

తల్చుని కంట నీరెట్టని రోజులేదు. వెళ్ళినకొత్తలో యిదేవిటో నాకంతగా తెలియదు తరువాత లక్ష్మాయమ్మగారే చెప్పింది. 'నిన్ను చూస్తే మా అమ్మను చూసినట్టే వున్నదమ్మా!' అన్నారు డాక్టరుగారు. నీకూతురుకు మా అమ్మాయిపేరు పెడుతున్నాను 'పుష్పవల్లి' అని. ఆ రోజునుంచీ అలాగే పిలుస్తున్నారు నేనూ అందుకు కాదనలేదు—

అప్పుడప్పుడూ పుష్పవల్లి కట్టుకున్న నడిపాతచీరలు నా కిస్తూవుండేది లక్ష్మాయమ్మగారు. నేను వాటిని తీసుకోడానికి సంకోచించేదానిని. 'ఫరవాలేదమ్మా!' చిన్నదానివి. నువు కట్టుకుంటే యెవరేమంటారు? అని అనునయించి ఆవిడ నాకిచ్చేది. అయినా ఖరీదైన చీరలు కట్టుకుంటే యెవ్వరేమనుకుంటారో అని నాకూ బిడియంగానే వుండేది.

అన్నివిధాల వారియింట్లో నాకు చనువూ, స్వాతంత్రం ఏర్పడినయ్. ఇంటికివచ్చి అన్నం వండుకుతినడం తరువాయి. పొద్దస్తమానం డాక్టరుగారింట్లోనే గడుపుతూవుండేదానిని. ఒకొక్కనాడు వాళ్ళతోపాటు తిని అక్కడే పడిఉండేదానిని. వాళ్ళతోపాటే సినిమాలకీ, నాటకాలకీకూడా వెడుతుండేదానిని.

స్వంతఇంట్లో వున్నట్లే, తల్లిదండ్రుల రక్షణక్రింద వుంటూ, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళమధ్య మెలిగినట్టు నేను డాక్టరుగారి సంసారంలో మెలగాను.

ఈ ప్రపంచంలో నాకు వారిద్వారానే ఆలనా-పాలనా దొరికింది. నాపొట్టగడపుకుని నా బిడ్డను బ్రతికించుకోడాని కెంత

ఆసరా ఏర్పడింది. నిజంగా వారుగాక నాకు మరి తల్లి దండ్రు లెవరు ? ఇంక జీవితంలో నాకేర్పడిన కొరతను ఎవ్వరుమాత్రం తీర్పగలరు ?

ఇంతవరకూ వారు నాకిచ్చింది పేరుకు పదిరూపాయలు గాని ఏ క్షణాన ఏది కావాలన్నా తీసుకువెళ్ళమని లక్ష్మి యమ్మగారు చెప్పేది.

ఆరు నెల్లు గడిచినయ్. ఏవో కొన్ని యిబ్బందులవల్ల వంట మనిషి నరసమ్మగారు మానుకున్నది. లక్ష్మియమ్మగారికి చెయి విరిగినట్లయింది. నా పని నేను నెరవేరుస్తూనేవున్నాను. వంట కూడా నాచేత చేయించుకుంటే బాగుంటుందేమో, అను కొంటున్నట్లు వారి అభిప్రాయం గమనించి ఒకనాడు నేనే అడిగాను. "నీఅంతట నువు కష్టపడలేవుపిన్నీ ! ఆ వంటకూడా నేనే చేసిపెడతాలే," అని. ఆవిడగారు అందుకు మొదట్లో ఇష్ట పడకపోయినా తరవాత వొప్పుకున్నది. ఇంక నాసంతోషానికి మేరలేదు.

నన్నీకష్టసముద్రంలోనించి వెలికిదీసి ఒక మనిషినిగా రూపొందించినవారి ఋణం ఎలా తీర్చుకోగలనా, అని తహ తహ లాడిపోతున్న నాకు ఈ అవకాశం దొరకడంతో అంతు లేని ఆనందం కల్గింది. నాచేత్తో యింత అన్నం వడ్డించడం కంటే భాగ్యం మరొకటి లేదుకదా అనిపించింది. పార్వతీపర మేశ్వరుల సేవకంటే నాకీదంపతుల సేవాభాగ్యం లభించడానికి యెంతటి సుకృతం చేసుకున్నానోకదా అని నాలో నేనే మురిసి పోయాను.

ఆనాటినించీ నేనింటికి వెళ్లడమే మానేశాను—డాక్టరుగా రన్నమాట ముమ్మాటికీ నిజం. ఎక్కడపుట్టానో, ఎక్కడ పెరిగానో, ఇప్పుడిక్కడ బ్రతుకుతున్నాను. నిజానికి వీరికీ నాకూ యేమిటి సంబంధం ?

రోజులు గడచిపోతున్నై, కాని ఆ సంగతి నాకు తెలియనట్టే వున్నది. నేను పుట్టింతరవాత కష్టసుఖాలగురించి అంతగా విననూలేదు, అనుభవించనూలేదు. ఆయన బ్రతికి వున్నన్నాళ్ళూ, ఆనాలుగుగోడలమధ్య పడివుండడంతోనే సరిపోయింది. ఆరోజుల్లో ఏదో తక్కువయినట్లు, లోపల్లోపల కుములుతూవుండేదానిని కాని, నిజానికి అదో కష్టంగా అనుకోలేదు నేను. ఎటొచ్చీ ఆయన ఇల్లుకూడా షావుకారుకు వ్రాసి, మేము పాకలోకివెళ్లడం సంభవించినతరవాత పరిస్థితులు తల్చుకుంటే నాకవి కష్టాలుగాతోస్తయ్. డాక్టరుగారింట్లోకివచ్చి చేరేవరకూ నేను అనుభవించినవి కష్టాలుగా భావించుతాను. వారిచలవవల్ల అవ్వీ తొలగిపోయినట్లేవున్నది నాకు. అందుకనే నేనెలా కాలం గడుపుతున్నానోకూడా అంతు చిక్కడం లేదు. నా కూతురు 'పుష్పవల్లి' పెద్దదవుతోంది. అదే నాకు కాలంగడుస్తున్న గుర్తు.

ఒక సంగతిమాత్రం చెప్పడం మరిచాను. మా ఆయన బ్రతికున్నప్పుడు అద్దెలేకుండా స్థలంయిచ్చిన షావుకారు ఆయన పోయిన ఏడెనిమిది నెలలవరకూ వూరుకొని తరువాత ఖాళీ చేయించుకున్నాడు. మాఇంటికి కలప వగైరా అన్నీ తానే సప్లయిచేసినట్లు రసీదులు పుట్టించి తీసుకుపోవడానికి సిద్ధమై

నాడు. నే నీసంగతి డాక్టరుగారికి చెప్పుకున్నాను. ఆయన ఇలా అన్నారు: 'వాడు వట్టి కర్కోటకుడమ్మా' నిజమైనా అబద్ధమైనా అంతపనీ చేయించేతీరతాడు. ఆ దుర్మార్గుడితో తగూలాడడం మనకు పనువుతక్కువ, నువ్వువచ్చి మా యింట్లోనేవుండు తరువాత నీకు తగిన సదుపాయం నేను చేయిస్తాగా!' అని.

నేనూ ఆ పనేచేశా వెల్లాళ్ళకల్లా వారియింటికి కొంచెం దూరంలోవున్న వొక చిన్నస్థలంలో రెండుగదులు వేయించి నేనుండే ఏర్పాటు చేయించారు

ఆరుసంవత్సరాలపాటు కడుపులో నీళ్లు కదలకుండా హాయిగా గడిచిపోయిందినాకు డాక్టరుగారి చలవవల్ల. మా అమ్మాయికూడా ఏడెనిమి దేళ్ళపిల్ల యింది. బళ్ళోకివెళ్లి చదువు కుంటున్నదికూడా. దానికి కావలసినవన్నీ చొక్కాలు గౌనులు దగ్గిర్నుంచీ అన్నీ లక్ష్మాయమ్మగారే కుట్టించియిస్తూ వుండేవి.

ఈరోజుల్లోనే కాలం వృథాచెయ్యకుండా అవకాశం దొరికినప్పుడల్లా కొన్ని చేతిపనులు నేర్చుకున్నాను. నా కీవిష యంలో అన్నివిధాలా సాయంజేసింది లక్ష్మాయమ్మగారి పెద్ద కోడలిచెల్లెలు లక్ష్మీకాంతమ్మ.

ఆవిడకు చిన్నతనంలోనే, భర్త చనిపోయాడట. అప్ప ణ్ణించి ఏదో వ్యాపకార్తికోసమని స్కూలులో ప్రవేశపెట్టి కొంత వరకూ చదివించారట. కొన్నాళ్ళయినతర్వాత ఆవిడ అంత టితో పూరుకోక తనకు మనోవర్తిగా వచ్చిన సొమ్ములో కొంత ఖర్చుచేసుకుని మదరాసులో ఆంధ్ర మహిళామండలి

వారి విద్యాలయంలో మెట్రిక్యులేషన్ వరకూ చదివింది. నూలు వడకడం, కుట్టుపని మొదలైనవాట్లలో పరీక్షలుకూడా ప్యాసయిందట. అప్పటికావూళ్లో ఆడపిల్లల హైస్కూలులో టీచరుగా పనిచేస్తూవుండేది.

ఆవిడ నాకుచేసిన నైతికసహాయం యీజన్మలో మరవరానిది. నా సంగతంతా విని గుండె చెరువయ్యేలా ఏడ్చింది పాపం! ఎంతో మెత్తనిమనసు. మనసువిప్పి మాట్లాడగలదు. కల్ల - కపటం, దాపరికాలు - అటువంటివేవీ యెరగదు నాకు చేతనైనసాయం చేస్తానక్కయ్యా! నీఅంతట నువ్వు బ్రతకగలిగేలా చేస్తే సరికదా! అన్నది లక్ష్మీకాంతం నా చేతిలో చెయ్యివేసి-అప్పటికే నేను నూలు వడికేదాన్ని, జాకెట్లూ గౌనులూ కత్తిరించి చేతిమిషనుమీద కుట్టగలిగేదాన్ని కూడా.

లక్ష్మీకాంతం నన్నెప్పుడూ కనిపెట్టే వుండేది. నన్నెవరూ ఏమీ అనేవారేకాదు. ఎవరైనా మాటవరసకన్నా నాపైన యీగవాలనిచ్చేది కాదు. తనకు తానూ అంతే-

అప్పుడప్పుడూ నాదగ్గిర తన గొడవంతా వెళ్ళబోసుకునేది లక్ష్మీకాంతం. ఆవిడకు తెలియకుండానే యెంతోకన్నీరు కారిపోతూ వుండేది. ప్రపంచానికి ఎక్కడలేని అహంభావమూ కనబరుస్తున్నట్టు నటించినా తనంతటతాను విచారించుకోవాల్సి వచ్చేసరికి దుఃఖం కట్టలుతెగి వస్తూవుండేది పాపం! వెంటనే నిరాశగా పెదవివిరుచుకుని ఊరుకొనేది. ఇంక నే నావిడకు కొత్తగా బోధపర్చవలసిన విషయాలేమి వుంటయ్?

అదేమిటో నన్ను చూస్తే లక్ష్మీకాంతానికి యెక్కడ లేని సంతోషము, తృప్తీను-నీకే మక్కయ్యా? యీ వెధవ ప్రపంచాన్ని లెక్క జెయ్యకుండా పుష్పవల్లిని చూసుకుని హాయిగా కాలంగడపవచ్చు, అని వెర్రి ఆవేశంతో అంటూ ఉండేది. ఒక్కసారికాదు, ఎన్నిసార్లు అన్నదో ఆమాట లక్ష్మీకాంతం.

ఎందుకనో మరి, నాకంత త్వరగా అర్థంకానూలేదు అర్థం చేసుకుందామని అంతగా ప్రయత్నమూ చెయ్యలేక పోయాను. నేనూ వొకపిచ్చి నవ్వునవ్వి ఊరుకుంటూ వుండే దానిని. మరొకమాటు లక్ష్మీకాంతం తనలోతనే అనుకుంటూ వుండగా విన్నా నీ మాటలు – 'ఎన్నాళ్ళు బ్రతికి ఏంలాభం? అనుకున్నవన్నీ బుగ్గిపాలయి నాకు, అని—

ఏవిటో దీనికిపూర్వగాధ! 'నువ్వనుకొనే మాటలేవీ నాకు రవ్వంతైనా బోధపడడం లేదమ్మా! అన్నా నొకనాడు-వెంటనే అందుకుని మాటకుమాట ఇలాఅన్నది లక్ష్మీకాంతం.

'ఎందుకనే అక్కయ్యా! తెలీకుండా వున్నంతవరకే మనమిద్దరం మనుషులుగా బ్రతగ్గలం, పుష్పవల్లిని చూసు కుంటూ హాయిగా బ్రతుకు, అని—

నేను, అప్పటికావిడమీద ఏర్పడిన చనువును పురస్క రించుకొని ఇలా అన్నాను. 'నీమొహం ఏంమాటలవ్వి బ్రతక్క చస్తామాయేమిటి ఇంతమాత్రానికే? అయినా అసలు సంగతే మిటో దాపరికం లేకుండా చెప్పెయ్యి! దేనికిలా మనసులో

గుంజాటనపడుతూ ఉండడం? అదేదో తెలిసిపోతే నాకూ ఆదుర్దావుండదుగా, అని.

లక్ష్మీకాంతం నవ్వేసి చెప్పనన్నది. దీని మూలాన సుఖంగా కాలం గడుపుకుంటూ బ్రతుకుతున్న నిన్ను కలవరపెట్టను అన్నది — నేనందుకు ఒప్పుకోలేదు. నేనేమీ కాపురస్త్రీ విషయాలకు మనసు చెదిరిపోయేదానిని కాదు. ఎంత లేవనుకున్నా పది పన్నెండేళ్ళు కాపరం వెలిగించాను, అన్నాను గర్వంగా పుష్పవల్లి వేపుకి చూశాను.

'నేనూ అదే అంటున్నాను; అన్నది లక్ష్మీకాంతం.

'అదేదో నాకూ తెలిసేటట్టు అను' — అన్నాను. ఇక చెప్పకతప్ప లేదు, 'సరే అయితే రేపు చెపుతాను. అని ఆనాటికి సరిపెట్టింది'—

ఆవెన్నాడు ఆదివారం కావడంవల్ల లక్ష్మీకాంతం యింట్లోనే వుంటుందని తెలుసు నాకు. మధ్యాహ్నానికల్లా వంటా పెట్టూ ముగించుకొన్నాను. పుష్పవల్లి ఎటో ఆడుకోబోయింది. నేను సరాసరి అక్కడికి చేరుకున్నాను. నేను వెళ్ళగానే, పరధ్యానంగా ఆలోచించుకొంటున్నదల్లా లేచినిల్చుని 'రా అక్కయ్యా! అంటూ పక్కనున్న కుర్చీ యివతలకు జరిపింది నేనూ అందులో చతికిలబడ్డాను. సరేగానీ, నిన్న నువ్వు చెబుతానన్నదేదో వెంటనే కానియ్యి! కాఫీవేళకల్లా తిరిగి లేచిపోవాలి అన్నాను. ఆదుర్దాగా లక్ష్మీకాంతం నావంకజూసి నవ్వింది. 'నువ్వెంత వెర్రిదానవమ్మా' అన్నట్టు — ఇంకా ఆ

మాటనే కొంగునముడివేసుకు వచ్చానన్నమాట అన్నది తిరిగి నవ్వుతూ.

'ఇది యింతటితోనే తేల్చివెయ్యాలనుకుంటున్నావా ఏమిటి? అన్నాను - తేల్చెయ్యను నేను మునిగి, నాతోపాటు నిన్నూ ముంచుతాను ఇకవిను! అంటూ తనజీవితకధనంతనీ పూసగుచ్చినట్టు వినిపించింది. లక్ష్మీకాంతం - ఇంకెందుకులే అక్కయ్యా! ఇదంతా మనసులోపెట్టుకోకు ఎంతతొందరగా మర్చిపోతే అంతమంచిది.' అంటూ భారంగా నిట్టూర్చి తనూ కుర్చీలో మేనువాల్చింది.

'ఇందులో మర్చిపోవలసిందీ లేదు. జ్ఞాపకంవుంచుకుని దిగులు పడవలసింది అంతకంటే లేదమ్మా' అన్నాను నేను.

నువుకాబట్టి అంత వోపికగావిన్నావు, మరెవ్వరికి కావాలి నా దరిద్రపు బ్రతుకుసంగతి, అన్నది లక్ష్మీకాంతం. అంతటిదైన్యం అవిడమొహంలో నే నెన్నడూ చూడలేదు.

అచ్చంగా నాకధ నాకే విన్పించుతున్నట్లున్న దన్నాను- నిజానికి అంతే ఏవోకొన్ని స్వల్పమైన మినహాయింపులుతప్ప మా ఇద్దరిజీవితాలూ వొక్కఅచ్చులో పోతపోసినట్లున్నయ్.

అంతటితో ముగించుకుని ఆనాటికి నే నింటికి నడిచాను- రాత్రికి - పనులన్నీ పూర్తిచేసుకు పడుకున్నాను. పుష్పవల్లి నా పక్కలోనే పడుకుని వొళ్ళెరగని నిద్రపోతున్నది - పిచ్చి తల్లి పెళ్ళయితే వొక్కక్షణమైనా ఆగలేదు - నిజానికి మా జీవిత క్షోభలన్నీ దానికేం తెలుసయ్?—

వెన్నెల్లాంటి మనసు - తిరిగి ఆదశకు నేను రావాలంటే మరోకజన్మ ఎత్తాల్సిందేకదా ! నా చిన్నతనం జ్ఞాపకంవచ్చి ఎంతోసేపు కుమిలిపోయాను. వెంటనే నాలో అంతులేని వాత్సల్యం పొంగివచ్చింది. మా తల్లిని గుండెలకదుముకుని తల నిమురుతూ అలా పడుకునిపోయాను.

సాయంత్రం లక్ష్మీకాంతం చెప్పిన కథ అంతా నాకు మెలమెల్లిగా నెమరుకు రాసాగింది. ఆలోచించినకొలదీ నాలో వున్న నిరుత్సాహం, నిరాశా - అంతరించి ఒక కొత్తచైతన్యం పొంది వచ్చినట్లయింది. ఎందుకనో నాలోని జీవితాశ మరింత బలపడింది. అందుకు లక్ష్మీకాంతం స్వతంత్రంగా నిర్ణయించుకొన్న జీవితవిధానం కారణమేమో...

నే నిప్పుడు స్వతంత్రంగా బ్రతుకుతున్నానా? అన్న ఆలోచన కొంత తడవునన్ను కలవరపెట్టింది. నేను స్వతంత్రను కాక వొకరికి బానిసనా? డాక్టరుగారు నాకు ప్రాణదాతలు వారికింత వండిపెట్టి నేనింత తినడంలో నా స్వాతంత్ర్యాన్ని హరింపగల బీజం ఏమున్నది?-

నూటికి నూరుపాళ్ళూ నేను స్వతంత్రనే. ఇది నా మార్గం. లక్ష్మీకాంతమైనా నాకు వంకపెట్టవీలులేదు. నా బిడ్డ పెద్దదై నాకు అసరాగావుండేవరకూ నాపాట్లు నాకుతప్పవు - లేదా నేనీమార్గాన్ని విడిచి యింతకంటే వుత్తమమైన మరో పద్ధతి నిర్ణయించుకోవాల్సిన అగత్యంపడితే ? - 'అమ్మయ్యో' నాకీఆలోచన అతి భయంకరంగాతోచింది. ఈ లోకంలో నే నింతకంటే తెగించి స్వతంత్రురాలనై బ్రతకగలనా? తల్లిచాటు

బిడ్డలాగే ఇన్నాళ్లూ డాక్టరుగారింట్లో బ్రతికాను వారినే నమ్ము కున్నానుకూడా. లేనిపోని అహంభావంచూపితే లోకం నన్ను మన్నించుతుందా? నిజానికి లక్ష్మీకాంతంమటుకు తాహతుకు మించి తెగించిందేమిటి? పరిస్థితులు ఆమెను అలా యీడ్చుకు వచ్చినయ్యంటే బాగుంటుందేమో... ఏమైనా మరొకసారి ఆమెను కలుసుకుని నాకున్న సందేహాలు కొన్ని అడిగి తెల్సుకోవాలి.

కడుపులో నీళ్ళు కదలకుండా యీ నాలుగుగోడల మధ్య నున్నంతకాలమూ నాకెలాటి అనుమానాలు, సందేహాలూ కలుగనేలేదు. ఆవిడదగ్గిరికి వస్తూ పోతూవుండడం మొదలెట్టాకే అదోలా మారిపోతున్నట్లున్నది నాకు – తలకు మించిన సాహసమ్మేదైనా తలపెడుతున్నానా, అనిపించింది—

'పుష్పవల్లిని చూసుకుంటూ హాయిగా బ్రతకమన్న లక్ష్మీకాంతం మాటకు అర్థమేమైవుంటుంది? – ఆమె తన జీవితంలో పూడ్చుకోలేని వెల్తిని నేను మాపుకున్నానా? ఒకబిడ్డ చేత 'అమ్మా' అనిపించుకోవడమే ఆడజన్మకు సఫలత అన్నమాటా ?—

నిజానికి యెవ్వరే పని చేసుకుబ్రతుకుతున్నా ప్రతిదానికీ ఉచ్చనీచాలను అంటగట్టుతూనేవుంటుందిలోకం. దానితీర్పులో నేను చేసేపని ఏ తరగతికి చెందుతుంది? లక్ష్మీకాంతం కూడా లోకంలాగే ఆలోచించి అదికప్పెట్టడానికి పై పైమాటలతో నన్ను బులిపించి పంపించిందా? తనకువున్న అసంతృప్తి బైటకు పొక్కకుండా నన్ను ఉచ్చేసిందా?—

ఆనాడు యేకాంతంలో యిలాంటి ఆలోచనలెన్నో వరసక్రమంలేకుండా నాతలలో పరుగెత్తినయ్. ఓ క్రమానికి అనిపించింది నాకే, లక్ష్మీకాంతాన్ని గురించి ద్రోహంగా ఆలోచిస్తున్నానా? అని, కాని తమాయించుకున్నాను రాత్రి ఎంత పొద్దోయిందో నాకే అంతుపట్టలేదు. పుష్పవల్లి ఏదో కలవరింతగా అటు వొత్తిగిలింది. ఓదార్పుగా దానివీపుమీద నిమురుతూ గుండెల కదుముకున్నాను. ఏ వేళకు కునుకుపట్టిందో...

పొద్దున్న లక్ష్మీయమ్మగారువచ్చి పిల్చేవరకూ మెలకువరాలేదు. ఆమెను గడపలో చూడగానే చచ్చినచావైంది నాకు. వొంట్లో బావుంళ్ళేదా? అనడిగిందావిడ. లేదుపిన్ని ఇప్పుడే వస్తున్నానంటూ మామూలుగా పనుల్లోకి వెళ్ళిపోయాను—

ఆనాటిమధ్యాహ్నానికే డాక్టరుగారు మద్రాసునించి దిగారు— కాఫీతీసుకున్న తరవాత సావిట్లో కుర్చీలో కూర్చునుండగా లక్ష్మీయమ్మగారు వొకటిరెండుసార్లు వారిదగ్గరకు వెళ్ళి ఏదో రహస్యంగా మాట్లాడినట్టుంది. నేను దూరాన్నించి చూశాను.

కొంతసేపైన తరవాత వంటింటిగుమ్మంలోకి వచ్చి 'అమ్మాయీ! వోసారి ఇలారా అమ్మా!' అన్నది. ఆమె గొంతులో మాతృభావం తొణికిసలాడిందాక్షణాన— నేను వెనక్కు తిరిగిచూశాను "ఆ...ఏమీలేదు, బాబుగారొకసారి అటు రమ్మంటున్నారు" అన్నది.

చేస్తూన్న పని మానేసి అడుగులో అడుగు వేసుకుంటూ ఆమె వెంటనడిచాను. నన్ను చూడగానే డాక్టరుగారి పెదవులపై చిరునవ్వు మెరసింది, రా అమ్మా, ఇలా రా! నాకుదగ్గిరగా రా?' అన్నారాయన- నేను వారిదగ్గిరకు కదులుతున్నాను, లక్ష్మియమ్మగారు గుమ్మంలోనే నిల్చుని నావెనకనించి నవ్వుతున్నట్లు వినబడింది. వెనక్కు తిరిగిచూశాను. ఇటునుంచి డాక్టరుగారూ నవ్వారు. నేను వెర్రిచూపులు చూడడం గ్రహించారు కాబోలు... "పిచ్చితల్లీ ఇలాకూర్చో, నాకు దగ్గరగా అన్నారు మళ్ళీ.

నేను చాపమీద కూర్చున్నాను. 'పుష్పవల్లి బడికి వెళ్ళిందికాదూ?' అన్నారు డాక్టరుగారు. 'అవునన్నట్టు తల ఊపాను. ఒక్కక్షణం కనులు మూసుకుని ఆలోచించారాయన నాతో అన్నారు. నీకోసమే మద్రాసు వెళ్ళివచ్చానమ్మా? అని-ఇద్దరమూ వొకరివంక వొకరు చూచుకున్నారు. వారి భావమేమిటో నాకు అర్థంకాలేదు తిరిగి డాక్టరుగారే అందుకున్నారు-

"మరేమీ లేదమ్మా, నువు ఇన్నాళ్ళుగా మమ్మల్ని నమ్ముకుని మా యింట్లోనే వున్నందుకు నీకు శాశ్వతంగా ఏదోవొక ఉపకారం చెయ్యాలనుకున్నా",- అంటూవుండగా నేను తలెత్తి వారిముఖంలోకి చూశాను, ఏం మాట్లాడాలో తోచలేదు. డాక్టరుగారు చెప్పుకుపోతున్నారు. "అదేదో నా ఘటంవుండగానే జరిగితే బాగుంటుందనుకున్నాను. తరవాత ఎవ్వరిమనస్సులు ఎలావుండబోతయ్యో! నీఅంతటనీవు స్వతంత్ర

జీవనం నెరపగలదానవైతే నాకేదిగులూ ఉండదు. ఆ మాత్రం ఆసరా జూపించలేకపోతే నా ప్రాణానికి ఉసూరుమంటావు. అందుకని పుష్పవల్లినీ నిన్ను కొన్నాళ్ళపాటు మద్రాసులో వుంచి చదివించి వో దారికి తేవాలనే సంకల్పం కల్గిందినాకు. అమ్మాయ్ 'కాన్వెంట్, స్కూలులో చేరుతుంది. నువ్వు మహిళా మండలివారి సంస్థలో చేరి వారు చెప్పినవన్నీ నేర్చుకున్నా వంటే నాకదే పదివేలు. నా ప్రాణం సుఖంగా, ఏ దిగులూ లేకుండాపోతుంది. ఇది నీకు సమ్మతమైతే నేనే దిగబెట్టివస్తాను. ఏమంటావ్ మరి?" అని నావంక జూశారు. లక్ష్మమ్మగారు వారి మాటకు వంతపలికింది.

కాదని చెప్పగల తాహతునాకేదీ? ఇదంతా కలా అనుకున్నాను- కాదు యదార్థమే- డాక్టరుగారు నాయెదురుగుండా కూర్చుని 'ఏమంటావ్ మరి? రేపే మన ప్రయాణం', అనితొందర పెడుతున్నారు. ఇంత క్షణాలమీద నాజీవితంలో యిట్టిమార్పు రాబోతుందనుకోలేదు. వచ్చినదానికి తలవొగ్గడం మినహా నే నవ్వుడు చేయగల్గిందిమాత్రం ఏమున్నది కనక సరే, అన్నాను డాక్టరుగారితో-

ఆయన అంతమాత్రానికే కొండెక్కారు- "నే నన్నదానికి వొప్పుకున్నావ్ నాకంతే చాలమ్మా నాకిప్పుడు ఎంత ఆనందంగా వుందనుకున్నావ్?" అంటూంటే నిజంగానే ఆయన గొంతు బొంగురుపోయినట్లుంది. కనులవెంట చిన్న నీటిబొట్లు రాలటంకూడా చూశాను. ఒక్కనిమిషం కనులు మూసుకుని తిరిగి ఇలా అన్నారు "లోకం కొందరిని దూషిస్తుంది, మరి

కొందరిని భూషిస్తుంది, ఇంకొందరిని వెక్కిరిస్తుంది. అవన్నీ లక్ష్యపెట్టకేం? ఎన్నడూ గడపకదిలి బైటకు వెళ్ళినదానవు కాదు కనక చెపుతున్నాను. రేపణ్ణించి మరో ప్రపంచంలో పడబోతున్నావు! అన్నీ తట్టుకుని ఆసాంతంవరకూ నిల్వగలిగితేనే మరి..." అంటూ అదోలా తల పంకిస్తూ సులోచనాల్లోనించి తీక్షణంగా చూశారు నావంక–

అంతపెద్దమాటకు నేను వెంటనే సమాధానం చెప్పగలనా? అయినా తప్పిందికాదు; ఇలా అన్నాను– "ఇందులో ప్రయోజకత్వం ఏమున్ననాది ? మొదణ్ణించీ మిమ్మల్నే నమ్ముకున్నాను ఇప్పుడూ అంతే. అసలీవుద్దేశ్యం ఎందుకుకల్గిందో... మీాదన్నది కాదనడానికి నోరు రావడంలేదు. నాస్థితి యెరిగున్నదేకదా! అమ్మాయి వొకదారికి వచ్చేవరకూ..." అంటూవుండగానే మాటమధ్యలో అందుకుని ఇలా అన్నారు డాక్టరుగారు– "అమ్మాయిసంగతేకాదు ముందు నువ్వొకదారికి రావాలనే నేనిలా సంకల్పించుకొన్నాను. పసికూన! ఇప్పుడు ఎవ్వరేం చెబితేమాత్రం దానికేంతెలుస్తుంది?– సరే అమ్మాయికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయించు" అని లక్ష్మాయమ్మగారితో అంటూ చివాల్న అక్కణ్ణించి లేచివెళ్ళారు.

నేను వెర్రిగా ఆవిడిమొహంలోకి చూశాను – సంగతంతా చెప్పిందావిడ – వారు ఎన్నాళ్ళనించో నాగురించి మధనపడుతున్నారట, సాటిదానిని ఇంట్లో అట్టే పెట్టుకుని చాకిరీ చేయించుకోకపోతే ఏదో వొకదారి చూపించితేనే బాగుంటుందని డాక్టరుగారితో పదేపదే అంటూవుండేదట

లక్ష్మమ్మగారు. ఆయనగారు ఏవో పనితొందరలవల్ల కాని, నన్ను గురించి వొక దృఢాభిప్రాయానికి రాకపోవడం వల్లగాని, ఇంతవరకూ నెట్టుకువచ్చారట - మొన్నను మదరాసు వెళ్ళినప్పుడు ఏమైనాసరే తేల్చుకురమ్మని కోరిపంపించిందట. అందుకు ఆయన నిర్ణయించిన కార్యక్రమం యిది—

ఆ రాత్రికే ఈ విషయమంతా లక్ష్మీకాంతానికి విన్పించాను. ఆవిడ ఆనందానికి మేరలేదు, నన్ను యెన్నోవిధాల అభినందించింది. తనకు తోచిన ఏవో కొన్ని సలహాలిచ్చింది - కొద్దిరోజులకే డాక్టరుగారు మమ్మల్ని తీసుకువెళ్ళి మదరాసులో దిగబెట్టారు. కావలసిన ఏర్పాట్లన్నీ చేశారు - ఆనాటినుంచీ నా జీవితం మరొకదారిన నడిచింది. ఈనాడు నాకు నేను స్వతంత్రంగా జీవించగల్గుతున్నానంటే అది డాక్టరుగారి దంపతులచలవే - మా వుష్పవల్లి కూడా చదువుకున్న భర్తనే చేసుకున్నది. అత డిప్పుడు మదరాసులోనే వొక బ్యాంకులో పని చేస్తున్నాడు—

నా జీవితానికి వెలుగునిచ్చిన ఆ పుణ్యదంపతులకు నేనెంతో ఋణపడివున్నానని ప్రతిసాయంకాలమూ చల్లని వేళలో అనుకుంటూవుంటాను. ప్రతిఉదయాన, చేయెత్తి నమస్కరిస్తూ వుంటాను—



# సెలవునాటి జంజాటం

"కాఫీ తీసుకు రమ్మంటారా?"

"తొందరేం?"

"రోజూ ఈపాటికి తాగేస్తారుకదూ!"

"ఆదివారం కనక కాస్త తీరికగా కూర్చుని పుచ్చుకుం దామని."

"బావుంది! ఆదివారంనాడు ఆకలి మందగిస్తుందా యేవిటి?"

"బయట పనితొందర వుంటేకదా కడుపులో ఆకలి తొందర! వారంమొత్తంలో భగవంతుడు ప్రసాదించిన శలవు రోజు ఇదిఒక్కటి. ఇంతమాత్రమేనా విశ్రాంతి దొరకకపోతే బ్రతగడం ఎంతకష్టం అనుకున్నావ్?"

"వంటయింట్లో ఆడదాని బ్రతుకంతకష్టంఅవ్వనా?"

"కాదంటే నువ్వు వూరుకుంటావ్ కనకనా? అన్నట్టు 'వంటయిల్లు' నాటిక వ్రాశావ్ కాబోలు!. ఏమయింది దాని సంగతి?"

"ఏవీకాలేదు. మామహిళామండలి యానివర్సరీరోజున ఆడడానికి, ఏర్పాట్లన్నీ జరిగినయ్."

"చెప్పవూ! అదృష్టం అంటే అలా వుండాలి. ఈ చదువులు ఎన్ని చదివితే ఏమిలాభం? అయితే యానివర్సరీ ఎప్పుడు?"

"పాపం! ఏమీ ఎరగనట్లు - మా ప్రోగ్రాం వేపన్ల మూడు రోజుల్నించీ మీ డ్రాయిరుమీదే పడివున్నయ్!"

"మూడురోజులైతేనేం ముప్పైరోజులైతేనేం? అంత తీరిగ్గా చూసిందెప్పుడు? పగలల్లా ఆఫీసులో సతమతమై సాయంత్రం ఇంటికివచ్చి నాలుగు మెతుకులు నోట్లో వేసుకో గానే ఎక్కడలేని నిద్రా యీ దౌర్భాగ్యదామోదరుణ్ణే ఆవహిస్తుందాయె, చూట్టంలేదూ? నువు వంటయిల్లు సర్దుకుని తలుపు వేసుకువచ్చేలోపల ఒక కునుకోయి లేస్తుంటేని; బయటికి పోతే సరేసరి.

ఇంక తెల్లారి కాఫీ తాగేసరికి ఎనిమిది. కాసేపు అటూ ఇటూ మాలిగి అన్నంముందుకువస్తే గడియారం తాం.గ్న తొమ్మిదిన్నర కొడుతుంది. ముక్కా నోటా కొట్టుకుని బయలేరిపోతే అప్పటికే నేనేజరు రంకెలు. ఇంకా నీప్రోగ్రాం చూసి ఏడిచిందెప్పుడు? అయినా ఏదో సందువాళ్లని నా చెవిని వేస్తే పోదూ?"

"అంత హైరాను పడతారెందుకు? నేను ఏమన్నా ననీ?"

"మరి, ప్రోగ్రాం చూడలేద నేనెపం నామీద వేస్తావేం? ఏమీ ఎరగనట్టు?"

"నాకుమటుకు తీరికెక్కడిది? వంటా, పెట్టూ అవగానే మా పనులతోనే సరిపోతుంది. మీరైతే ఆదివారంకదా అని, హాయిగా కూర్చుంటారు. మాకు రోజూసోమవారమేనాయె!"

"సరే- ఎలాగో అలా చెప్పావ్, సరిపోయింది మా కేమన్నా అక్కడ అడుగుపెట్టే అవకాశం వున్నదా? లేక అందరూ ఏకమై మగపురుగును విదిలించి కొడతారా?"

"మా కేమంత ఖర్మం? మగవాళ్ళకోసమే నాటకం వ్రాసాను."

"ఇవాళత్తో మీనాటకం చూసిన మగవాళ్ళందరికీ వంటచెయ్యటం నేర్పుతారన్నమాట?"

"నేర్చుకోవాల్సిన అవసరం వున్నదని గ్రహించితే చాలు."

"గట్టిదెబ్బే కొడుతున్నారే! కొంపతీసి ఆడవాళ్ళు అందరూ ఒక్కటే హారం వేసుకు కూర్చోరుకదా? సరే జరిగే దేదో జరుగుతుంది. ఆకాఫీ ఇలా పడేసి వెళ్ళి వంటచెయ్యి. రాత్రికి నువ్వు ఎలా మారిపోతావో?"

"ఏమిటి మీ హాస్యగాడి వేషాలన్నీ?"

"హాస్యంలేదు-జోస్యంలేదు. అలవాటులేనివాడు నశ్యం పీల్చినట్లవుతోంది!"

"తలపట్టుకుని, తందనాలు తొక్కకండి!"

"మీనాటకం చూస్తే, నెత్తికి చేతులురావనా? సరే నాయికా, నాయకులు ఉంటారా?"

"ఉండకేమి? నాయకుడిచేతే స్టేజిమీద వంట చేయిస్తారు."

"అంట తెప్పాలాలు తో మించరూ?"

"అంతేనా?- పొయ్యిలుకూడా అలికిస్తారు!"

"వాడు మర్నాటికి మనలోకంలో వుంటాడా?"

"మనలోకంలోనే, మనదగ్గిరే- వుంటాడు."

"వాడికి ఎంతయిచ్చినా ఋణంలేదు. ఏమంటావ్?"

"ఏమీఁ ఇవ్వరు; అందరూ వుచితంగానే వస్తారు."

"అయితే వాడి ఖర్మం కాలిందన్నమాటే- పాపం పండిందన్నమాటే!"

"ఏదీ కాలేదు. మీకెందుకు అంతగాభరా?"

"నాకేంవుందిలే తోటివెధవకి తాటాకులు కడుతున్నారు కదా అని."

"తాటాకులూ లేవు, డప్పులూలేవు, ఊరికే రభసచేసుకుంటారెందుకు? ఆ వేషంవేసేది నేనే——"

"అయిందీ? మనకొంపకే యెసరు పెడుతున్నావన్న మాట? మరి ఆఫీసుగతి?"

"భగవంతుడే చూస్తాడు."

"స్టేజిమీద అన్నంవండించే ఆ నాయికామణి ఎవరు?"

"మన ప్రకాశరావుపెళ్ళాం...సత్యవతి..."

"ఏమిఁటమ్మోయ్ ప్రకాశరావంటున్నావ్?"

"అదుగో! అనుకుంటుండగానే వచ్చాడు."

"వచ్చాడు! వచ్చాడన్నమాట - అదిరా బ్రదర్ మన ఇద్దరికొంపలకీ ఎసరుపెడుతున్నారు."

"ఆ సంగతే మొత్తుకోడానికి ఇక్కడికి వచ్చాను భాయీ!"

"వారేయ్! సాయంత్రంలోపల మనమేదో వొకదారి చూసుకోవాలి. రాత్రి ఎనిమిదిగంటలు దాటితే ఈ కొంపల్లో మనకు మెతుకు పుట్టదనుకో! వండుకుతినాలి, లేకపోతే చావాలి."

"రేపు ఆఫీసుకువెడితే అందరికళ్లూ మనమీదనే వుంటా యిరా! కేశవరావుగాడు అప్పుడే ట్రంక్ బుజానపెట్టాడు. ఊనుపాలు గోడలనిండా పోస్టర్సు అంటించేశారు"

"కానేపు ఉంటే మన వీపులమీదా అంటిస్తారురా!"

"మొహంమీద ముద్రవేస్తారు కూడా!"

"ఇదంతా, మనం చందాకట్టించి, చేతులారా తెచ్చు కున్నాంరా!"

"అనుభవించక తప్పదురా!"

"కావిడ బుజానపెట్టు ఇంకా చూస్తావేం?"

"కళ్ళాపే కూడా చల్లాలంటావా?"

"ఆ మాటకొస్తే అంట్లగిన్నెలు కూడా తోమాలి"

"ఎంత అన్యాయం తలపెట్టారురా?"

"మన బతుకులు బయటపడే రోజువచ్చింది కానియ్యి!"

"ఇదేదో పెద్ద విప్లవం లాగేవుంది!"

"కాకపోతే యేమిటి? ఎందుకూ కొరగానివాళ్లు ఉద్యోగాలు చేస్తుంటే ఆడది అంట తెప్పాలాలు తోముతుందా అంట?"

"మనం, త్యాగం చెయ్యాలిరా భాయీ; త్యాగం చెయ్యాలి!"

"తప్పదు! తప్పదు!! ముమ్మాటికీతప్పదు! ఇంక్విలాబ్ జిందాబాద్"

"ఏమిటి అలా గొంతుకలు పాడారిపోయేలా? ఇద్దరూ కలిసి ఒక కొలిక్కి తెచ్చేట్టే వున్నారు కాస్తేసికి గంపంత చేస్తారు!"

"కాస్తా?- మా ఆవిడ ఎంత హంగామా చేస్తోందో నీకేం తెలుసు? మహిళామండలి యానివర్సరీకి, తను నాటకం వేస్తున్నానని, తప్పకుండా ఆరోజుకు రావాలనీ, అందరికీ ఉత్తరాలు రాసింది. అప్పుడే నలుగురు మిస్సమ్మలు బెజవాడనుంచి బస్సుదిగారు. ఇంక సాయంత్రమయేలోగా ఎందరురానున్నారో! రాత్రే వాళ్ళఅన్నయ్యా, వదినా వచ్చారు. మధ్యాహ్నానికి చెల్లెలు వస్తుందట. ఎంత కోలాహలంగావుందనీ మాయింట్లో? ఇదేదో విప్లవంఅని ఊరికే అన్నానూ?"

"అబ్బాయ్ ఎందుకొచ్చింది? ఇదంతా ఒక ప్లానుప్రకారం జరుగుతోంది. మనం త్వరగా ఎక్కడకన్నా జారుకుంటే నయం."

"ఎక్కడతిరిగినా తిరిగికొంపకే చేరాలికదా, అని."

"సరే అన్నంవేళదాకా తిరిగివద్దాం, పద!"

"ఇంకాయేం ఒకళ్ళకొకళ్ళు తోడయారు! ఇంతకీ-కాఫీ తీసుకురానా అని అడగొస్తే ఇంత గందరగోళం చేశారుకదూ? తాగయినా వెళ్ళండి!"

"అదీ ఒకందుకు మంచిదే తీసుకురా!"

"ఒరేయ్! ఇవ్వాళనుంచి కాఫీ మానేయడం అలవాటు చేసుకోవాలిరా!"

"కాఫీ ఏవిఁటి? అసలు ఆకలికాకుండా మందిచ్చే మహానుభావు డెవడైనావుంటే చూడు! హిమాలయాల కైనాసరే పడిపోదాం?"

"అక్కడికి పోయినా అయ్యారుహోటల్లో కప్పులు మ్రోగుతూనే వుంటయ్."

"మరేవిఁటి గతి? ప్రస్తుతం మనకు పెద్దచిక్కు వచ్చి పడిందే!"

"సరే ఇవాళ ఆదివారమేకదా! కాలం, కర్మం వక్రించకుండావుంటే రేపటిమాట. ఇదుగో ఈ గుక్కెడు కాఫీ నోట్లో పోసుకో! ఆఁ...ఇక బజారు బయల్దేరుదాం, పద!"

* * * *

"శకునంకాలేదు రా బ్రదర్!"

"ఏ మొచ్చింది?"

"చాలా ఘోరమే జర్గబోతోంది"

"చంపకు! దారిపొడుగునా"

"ఇంకా నాలుగుఅడుగులు ముందుకువేస్తే చచ్చేమాటే ఖాయం. వాడు మనల్ని చంపేమాటే నిజం."

"ఎవడు వాడు ?"

"ఎవడంటూ వేవిఁటి ? - అడుగో కేశవరావుగాడు 'రాకెట్'లా వచ్చిపడుతున్నాడు. వాడివెంట నారాయణ మూర్తి, ఆ కిల్లీ కొట్టుముందు ఎవరితోనో బాతాఖానీకొడుతూ ఆగాడు చూడు! వాడి కంటబడితే ఇవాళ వదిలించుకోవటం మనశక్యంకాదు. చచ్చామన్నమాటే- ఆదివారం హాయిగా 'ఎంజాయ్' చెయ్యకుండా ఆ వెధవతో యెందుకొచ్చింది ? 'డర్టీ ఫెలో' "

"రానీయరా! మనతోపాటు వాడూను."

"ఎన్నటికీకాదు. వాడితో క్షణం మాటాడలేము."

"వాడితరహాఅది మనం ఏంజేస్తాం?"

"అందుకనే ఇక్కణ్ణుంచి వెనక్కుతగ్గడం మంచి దంటున్నాను."

"చెప్పానుకాదు? వాడు ట్రంక్ బుజానపెట్టాడని?"

"అంతేకాదు, ఈవిషయంలో వాడు చాలా చెడుగా ప్రవర్తిస్తాడు కూడా. మనలాగా వాడు ఎన్నడూ విచారించ లేదు."

"మనం ఇంటిదగ్గర ఎంత హంగామా చెయ్యలేదు?"

"మనవన్నీ వట్టి నాలుక చివరిమాటలు."

"అదుగో రథం కదిలింది ఇప్పుడు ఏంజెయ్యమంటావో చెప్పు!"

"మరోదారి పడదాం!"

"...............?"

"వాళ్ళఇంట్లో మొదణ్ణించీ ఒక అభిప్రాయం జీరించి పోయింది తెలుసా?"

"ఏమిటది?"

"ఆడది బయట అడుగు పెట్టకూడదు అని."

"అవునులే–వాళ్ళనాన్న, ఒకటి రెండుసారులు నాతో అన్నాడుకూడా."

"ఆయన సరేసరి–మూరెడు పొడుగుచుట్ట వెలిగించి, అరుగుమీద కూర్చుని వచ్చేపోయే 'గర్ల్స్'నుచూసి, ఇష్టం వచ్చినట్లు మాట్లాడుతూఉంటాడు. కావడానికి పెద్దవాడు అన కూడదు కానీ...ఒకొక్కప్పుడు ఆయన నోటికి హద్దూ పద్దూ ఉండదు."

"సరే. ఇంకేం, వీడికీ అవే పట్టువడినయ్యన్న మాట?"

"పట్టుపడడమే కాదు. ఆయన అని వూరుకుంటే వీడు ఆచరణలోనే చూపెడుతున్నాడు."

"వాళ్ళ వ్యక్తిగత విషయాలలో మనకు జోక్యం ఎందుకుగానీ, మొన్నటిరోజున వాడు అలా ప్రవర్తించినప్పటి నించీ నాకు మహాచెడ్డ అసహ్యం వేస్తున్నది."

"పోనీ, వాడిపెళ్ళాం వచ్చిందేఅనుకో అందరితో కలిసి! అంతమాత్రానికి అక్కడే చీవాట్లు వెయ్యాలా? నలుగురిలో తిరిగే వెధవ అంత నోటితొందర యెందుకు?"

"అన్నట్టు, ఇవాళ-శక్రటరీ ఉపన్యాసంలో పీడి ప్రస్తావనకూడా వస్తుందనుకుంటా."

"రాదుమరీ? వాళ్ళసంఘం యెదటవాళ్ళకి మనసు నొచ్చేటట్టు ప్రవర్తించాడు!"

"నాటకం ప్రారంభించబోయేముందు ఆవిడపెద్దలెక్చర్ దంచేస్తుందటగా?"

"అంతటితో వూరుకుంటే నయమే - తన అభిప్రాయాలన్నీ 'డిక్టేట్' చేసి, నాటకం వ్రాయించి మా ఆవిడ పేరు పెట్టిందిరా."

"నువ్వు చదివావన్నమాట?"

"నేను ఆరాత్రే చదివాను. కాని, ఆవేశానికి తగిన అనుభవం కనుపించదు."

"అయితే ఏమవుతుందంటావ్?"

"రంగంమీదకు వచ్చి 'సక్సెస్' అవటం కష్టం."

"కేశవరావు నాటకానికి రాడూ?"

"రావచ్చు; వాడిపెళ్లాం రాదు-"

"ఇంకా యెంతదూరం ఇలా చంపుబామనీ? నాకు ఓపికలేదు పోతావేం? లోపలికి చొరబడు! మ్యాటినీకన్నా పోదాం!"

*    *    *    *

"సరేగాని, ఎంతమందికి వంటచేశావో చెప్పు!"

"ఎంతమంది వున్నారు మనింట్లో?"

"ప్రకాశరావ్ ఇవాళ ఇక్కడే తిష్ఠవేస్తున్నాడు."

"ఇక్కడవుంటాడా? వాళ్ళయింటికి అంతమంది చుట్టాలు వస్తేనూ?"

"వాడి ప్రారబ్ధం అది-ఏంజెయ్యమంటావ్? నలుగురు ఇంట్లో భోజనంచేస్తుంటే చూసి ఏడవలేడు."

"మీమాటలు మరీవిచిత్రం! కేకలేసి ఇంటికి పంపండి!"

"వాడా వెళ్ళడు - ఇప్పుడు ఆ అన్నం ఎట్లాగూ సరిపోదు. మరో అత్తెసరు పడెయ్యి!...చూస్తావేం వుంటానంటే వాడు కదలడు. అన్నట్టు పనులన్నీ తొందరగా ముగించుకుని నువ్వు వెళ్ళిపోవాలి కావున్ను - ఏవీ అనకుండావుంటే అసలు సంగతి చెబుతా - వాడు ఇవాళ సేమ్యాపాయసం తినాలనుకున్నాడట. చెప్పినా ఇంటిదగ్గర ఎలాగూ వండరు. పొద్దుణించీ లోలోపల మధనపడి చస్తున్నాడు. బజారు వెళ్ళేసరికి నాతో బయటపెట్టాడు. పొట్లం కొనుక్కు ఏడవమన్నాను. జీడిపప్పు, కిస్మిస్, సరంజామంతా కొనితెచ్చాడు - ఇవిగో! అన్నీ నీ ముందర పెడుతున్నా, వస్తూ వస్తూ పాలు తీసుకువస్తానని హోటల్లో చొరబడ్డాడు. సరేనా? కాసేపు శావిట్లో విశ్రాంతి తీసుకుంటాము.- అడుగో సిద్ధం, తిండి అంటే ఎంత యావ అనుకున్నావ్?"

"చూశావమ్మా ఏమంటున్నాడో? 'స్టోర్సు'కు లాక్కుపోయి నాచేత అన్నీ కొనిపించింది వీడు; ఇప్పుడు నన్ను పట్టి తిండిపోతుకింద జమకడుతున్నాడు."

"ఇద్దరూ ఇద్దరే తోడిదొంగలు – అవునుగాని...ప్రకాశరావ్! ఇంటికి అంతమంది బంధువులువస్తే నువ్వు వెళ్ళకపోతే సత్యవతి ఏమనుకుంటుంది?"

"ఏమీ అనుకోదు. తొందరగా పరమాన్నం కానిద్దూ! పన్నెండున్నర అవుతోంది. అయినా వీడుఇంకా జ్ఞాపకంఉండి ఏడిశాడంటావా? అసలే అవిడ మతిమరుపు మనిషి."

"మీరన్నది మరీ బాగుంది. ఏమన్నా నల్లపూసా, ఎక్కడో జారవిడిచా మనుకోడానికి? ఇంత మనిషినీ ఎలా మర్చిపోతుందండీ?"

"మర్చిపోవాలంటే ఒడ్డూ, పొడుగూ ఎంతవున్నా నిష్ప్రయోజనమే."

"అయినా నువ్వు ఆలోచించి చూడవయ్యా!"

"మీరు ఇద్దరూ కలిసి పెద్దచిక్కే తెచ్చిపెట్టారు? అయితే నేను ఇంటికి వెళ్ళిపోతున్నాను."

"నిన్ను వెతుక్కుంటూ మీ ఆవిడే వస్తోందిరా! సరే. ఆవిడగారికి స్వాగతం పలుకు!"

"అన్నిటికీ మీరు వున్నారుగా!"

"అయితే ముందుగా మాట్లాడేవంతు నాదేనన్న మాట? ఏమమ్మోయ్ సత్యాదేవిగారూ! మీఆయనకోసం అంత బెంగపెట్టుకుంటే ఎలాగంట? క్షేమంగానే వున్నాడు. ఈపూట మాయింట్లో భోజనంచేసి వస్తాడు. వచ్చినదానివి నువ్వు ఆకలితో తిరిగివెళ్ళటం బాగుండదు. మా యింట్లో సేమ్యాపాయసంకూడా. అదీ మీఆయనకే మనుసయింది."

"మీమాటలు నాకేమీ అర్థంకావటంలేదండీ!"

"ఇంటికొచ్చి అరగంటయిందమ్మా! ఈ వరస మొదలెట్టారు ఇద్దరూను."

"అందరూ కనిపెట్టుకు కూర్చున్నారు. పదిగంటలకి తిరిగి వస్తానని ఇంతసేపా ఇక్కడవుండడం?"

"నన్నేంచెయ్యమంటావ్ మ్యాటినీకిపోదాం రమ్మని వీడు నాప్రాణంతీశాడు."

"ఒకళ్ళకంటె ఒకళ్ళు—"

"సరే వెళ్ళరా వెళ్ళు! సత్యాదేవిగారికి ఆగ్రహం వస్తే..."

"ఇదేవిటమ్మా ఆయన్ను వెళ్ళమంటారేం?"

"ఇహీహీ, మనంకూడా ఇవాళ వీళ్ళింటికేనండీ! భోజనానికి."

"మనమా?"

"అవును. సత్యవతి ప్రొద్దునేపిలిచి వెళ్ళింది."

"వీడికి తెలియకుండానే?"

"ఆయన బజారు వెడుతున్నానని నాతో చెప్పనేలేదు."

"ఇదేమిటిరా?"

"ఏమోరా."

"వాడికి తెలియకుండా పిల్చావుకనుక ఇది చెల్లదు. అందుకని నువ్వుకూడా ఇక్కడే భోజనంచేసి మరీవెళ్ళు! భావుందిరా నాతీర్పు?"

"ఆవిడ ఏమిటో చెప్పాలనుకుంటోందిరా!"

"నేను ఇంట్లో వంటచెయ్యలేదండీ!"

"అయితే ఏంజెయ్యమంటాన్?"

"పదండి! భోజనానికి"

"సమ్మె కట్టారు రా బ్రదర్! మనమీద సమ్మె కట్టారు"

"ఈ పాటూ, ఇవన్నీ ఏమిటి అక్కయ్యా?" "ఇహిహి... సేమ్యాపాయసం వండి పెట్టాలటమ్మా మీ ఆయనకు"

"వెళ్ళక తప్పదుటరా?"

"నాకూ అలాగే అనిపిస్తోందిరా!"

* * * *

"అవునోయ్ వేణూ! మీ యావిడ నాటకం వ్రాసిందని ఒక్కనాడేనా చెప్పావ్ కాదు. ఇందాక కేశవరావు చెప్పే వరకు నాకు తెలియదు. డి. సరోజిని ఎవరా? అని తల పగల గొట్టుకున్నాను."

"మరి కాసేపు వాడి వెంటబడితే మిగతా వివరాలన్నీ చెప్పేవాడు".

"వాడితో మాటాడటం నాకు అసహ్యమోయ్!"

"ఆ ఖర్మం నీకూ పట్టిందీ?"

"ఇంకా ఏదో మాటాడాలనుకున్నాడు. ప్రకాశరావు

మీ బావమరిదేనా? అన్నాడు. అవునన్నాను. ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా చరాల్న మహాసందులోకి దూసుకున్నాడు."

"వాడు...అదోరకం మనిషిలే."

"ఉక్కుమనిషయ్యా బావా! ఉక్కుమనిషి!"

"వాడి మొహం-ఏ పనీ, పాటా చెయ్యకుండా జరుగుతున్నాళ్ళు ఇలాగే వుంటారు నూతిలో కప్పల్లాగ."

"వాడి కేమంత ఖర్మమొచ్చిందోయ్. నలభై యకరాల సుక్షేత్రమైన పొలం, తాతలనాటినించి వస్తున్న పెద్ద లోగిలి, ఒక్కగా నొక్క వెధవ. ఇద్దరు చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళయినయ్. తల్లీ, తండ్రీ బావున్నారు. ఈ నాటికి బాధ్యత అనేది ఎరగడు."

"నువ్వు అనేది మరీ బాగుందోయ్ ప్రకాశరావ్!, మాటాడటంలో కూడా బాధ్యత యెరక్కుండా వుంటే ఎలాగ?"

"ఆ...మనకి కావాలి బాధ్యతలు, మర్యాదలూను, వాడికేం బంగారపు పిచ్చుక-అప్పుడే నాలుగు అయిపోయింది. అందరూ ముస్తాబయి, 'రడీ'గా వున్నారు. మనం ఇలాగే అఘోరిస్తున్నాం. పదండయ్యా పదండి! ఏ మూలకో చేరుకుందాం!"

"ఇంటికి వెడితే తాళంచెవి తీసుకువెళ్ళండి!"

"నువ్వు రావన్న మాట?"

"రాత్రికి కూడా మీరు ఇక్కడే!"

"ఇది మరీ బావుంది. అసలు రాత్రికే పిలవాల్సింది. మధ్యాహ్నం భోజనాలు పట్టి దంచగ — ఏమంటారండీ బావగారూ?"

"సేమ్యా, లడ్డూల్ దండగే - పదండి పోదాం!"

*   *   *   *

"'సక్సెస్' అయిందిరా ప్రకాశరావ్!"

"బాగా అయింది"

"బావగారు మాట్లాడరేం?"

"ఆ...ఏమీలేదు - రసం ముంచెత్తింది. ఇప్పుడే క్రమంగా తేరుకుంటున్నట్టున్నారు."

"అంతేలే-వారు సహృదయులు, రసాస్వాదనే వారికి ప్రధానం. విమర్శించమనడం మనదే తప్పు."

"ఇద్దరూ మంచి ఘటకులేనోయ్! పార్కులో నన్ను కూర్చోపెట్టి, ఇట్టే తిరిగి వస్తామని వెళ్ళారుకదూ?"

"రానటాని కేం వచ్చాము. నువ్వు అక్కడ్నించి ఊడా యించితే మాకెలా కనబడతావ్?"

"పోనీ నాటకం దగ్గరైనా కలుసుకున్నారా?"

"వేలకొలది జనం కిటకిట్లాడిపోతుంటే 'మైక్'లు మ్రోగిపోతుంటే నువ్వు కనబడొచ్చావ్? ఏ మూలనో నిల్చుని ఆ నాలుగుమాటలూ విని చక్కా వచ్చాము."

"ఇంతకీ సక్సెస్ అయిందంటావా?"

"ఆమాట నేనేం చెప్పగలనోయ్? ఒకరిపెళ్ళాం నాయకుడు, ఒకరిపెళ్ళాం నాయికాను."

"ఇదా నీతీర్పు? బాగానేవుంది."

"అయితే మాకేమీబాధ్యత్లేదు."

"ఒకటిమటుకు బాగుందిరా, శక్రకటరీగారి ప్రారంభోపన్యాసం."

"అందులో కేశవరావుగాణ్ణి కడిగేయడం మరీబాగుంది"

"దీనివల్ల ఆవిడగారు మంచి పలుకుబడి సంపాదించిందిలే."

"సరేగానీ, సగంలో కర్టెన్ దించేశారెందుకండీ బావగారూ? మీరు గ్రీన్‌రూముకు చాలాదగ్గరగావున్నట్టున్నారు?"

"వినిపించాల్సిన రికార్డులు మిగిలిపోయాయిరా!"

"అదికాదు ఉండవోయ్, బావగారు ఏదో చెప్పాలనుకుంటున్నారు"

"అయితే సెలవివ్వండి మహాత్మా"

"వాళ్ళకి ఏదో అసౌకర్యం కలిగివుంటుంది, సాధారణంగా నాటకాల్లో ఇది పరిపాటేగా!"

"ఆమాట శక్రకటరీగారే చెప్పుకున్నది"

"నాకూ అదే తోస్తుంది. అమ్మాయివాళ్లూ ఇంకా రాలేదే!"

"వస్తారు - బయటకొచ్చేసరికి ఎన్ని అభినందనలు?"

"మెడలోపడే పూలదండలకి లెఖ్ఖాపత్రం వుండదు."

"అదట్లా ఉంచండి! కుర్చీల్లో కూర్చున్న పెద్దల్లో ఏవో గుసగుసలు ప్రారంభమయినయి, కొందరు పెదవి విరచి తెల్ల పోయారు కూడాను, అదేమిటో ఆలకించరా?"

"వారికి ఇవన్నీ పట్టవు లేరా?"

"డైలాగ్ అద్భుతంగ వుందిరా!"

"పిడుగులు వర్షించినట్టుందంటే నమ్ము!"

"అమ్మయ్య! ఇప్పటికి విముక్తి లభించిందిరా వీళ్ళకి!"

"సత్యవతీ! ఇంతసేపు వున్నావేవమ్మా? సరోజనీ!"

"ఉండవయ్యా నీ ఇల్లు బంగారంగానూ! వాళ్ళప్రాణం కా స్తకుదుటపడనీ! ఇదేమన్నా వ్యవహారం అనుకున్నారా? ముక్కుకుసూటిగా మాట్లాడి తిరిగిరావటానికి?"

"నాటకమండీ నాటకం."

"దొంగాటకమన్నా కాదురా!"

"దొంగలు, దొరలతో పనేవుంది? ఇది 'వంటకం' లే!"

"మనపెద్దలు చెప్పనే చెప్పారు చేతులు కాలినాక ఆకులు వెతుక్కుంటే లాభం లేదని"

"వంటకం నాటకంలో ప్రదర్శిస్తారని వాళ్ళకు కూడా తెల్సుకోవాలోలు?"

"వాళ్ళు త్రికాలవేదులురా !"

"అదేమిటమ్మా సత్యవతీ! చేతికి కట్టు కట్టావే ?"

"చెప్పానుకాదయ్యా ఇదీ ఒక నాటకమే !"

"ప్రకాశరావ్ ! ప్రతివిషయంలో వేళాకోళమేనా ?"

"చిత్తం. తమ చేయి చూపించండి!"

"ఇదంత ముదుసపాకం కాదురా!"

"వీళ్ళెక్కడ కూచున్నారమ్మా అక్కయ్యా?"

"ఏమూల దాగున్నారో !"

"ఎట్టాగైనా 'నాయకుడు' అనిపించావమ్మా!"

"రంగంమీదికి వచ్చింతరువాత ఎలా కుంపటి వెలిగించాలా? అని సంశయం."

"రిహార్సల్‌తోపాటు ఈ ట్రైనింగ్ కూడా అయిపోతే బాగుండేది."

"అది కాదురా, ముప్పొద్దులా ముట్టించేదే కదా అని. దానికికూడా అంత హంగామా ఎందుకనుకున్నారేమో."

"ఇదేమిటమ్మా వీళ్ళు ఇలా మాట్లాడతారు?"

"వాళ్ళు అంతేలే అన్నయ్యా!"

"బావగారు ఎక్కడో కూర్చుని నిద్రపోయి వుంటారు!"

"చివరకు కుంపటి ఎలా అంటించావు కిరసనాయిలు తోనా? కొబ్బరిపీచుతోనా?"

"ఆహా! నాయకుడు కొబ్బరిపీచుతో అంటించితే ఆరి పోయింది. అంతేనమ్మా?"

"కానియ్యండి!"

"నాయిక పిడకమీద కిరసనాయిలుపోసి, చేత్తోపట్టుకు అంటించిందండీ! అదీ చేసినపొరపాటు—"

"నాయకుడు, కుంపటికూడా అంటించి కాఫీపెట్టి ఇవ్వ లేని చవట అనుకుని వుంటుంది."

"అంతే ఆవేశం వచ్చివుంటుందిలే."

"కిరసనాయిలు ఒక్కసారి భగ్గుమని మునివ్రేళ్ళని ముద్దు పెట్టుకుని వుంటుంది."

"వాడు తెలివిగలవాడు కనుక వెంటనే కర్రని దించేశాడు."

"ఒక 'జాంబక్' డబ్బాఅయినా వెంట తీసుకువెడితే బాగుండేది కదా!"

"మేం కొనుక్కువచ్చాములే. ఆ కట్లువిప్పి వరసని పట్టించండి!"

"ఏమైనా ఈపూట అన్నం కలిపి నోట్లో పెట్టక తప్పదు."

"ఫలహారంతో పూరుకుంటారేమోలే."

"లేపణ్ణించీ మనం చేతులు కాల్చుకోకనూ తప్పదు."

"చేతులారా చేసుకున్న దానికి ఫలితం"

"ఇంతవరకు అందరమూ ధన్యులమే"

"ఇదేనా భరతవాక్యం భోజనానికి లేవండి బావగారూ!"

"ఆదివారం ఆనందంగానే గడిచిపోయిందిరా!"

"భలేవాళ్ళయ్యా! మొత్తానికి! పదండమ్మా సత్యవతీ, సరోజినీ!"